# పీఠిక

"Oh woman; lovely woman; nature made thee
To temper man; we had been brutes without you;
Angels are painted fair, to look like you;
There is in you all that we believe of heaven
Amazing brightness, purity and truth
Eternal joy, and everlasting love"

OTTWAY.

స్నేహలతాదేవి యాత్మోపహారమునకుఁ బ్రేరణాధర్మము లత్యుదాత్తము లనుట స్పష్టము. ఆయమ లేఖయందు పితృగృహపరిరక్షణము సూచింపఁబడినది; కాని తన 'కన్యకాధర్మ'మునుగుఱించి యేమియుఁ గానరాదు. లేఖయందలి స్వప్నవృత్తాంతము ఆమె కవితాహృదయమును సూచించుచున్నది. స్థూలదృష్టికిఁ దోఁచునది యింతియైన-జ్ఞానోపాసకులకు స్నేహలతాదేవి జీవితమొక మహత్తరసందేశముగా స్ఫురింపక మానదు. స్నేహలతాదేవి వయసు ౧౫ సంవత్సరములు. ప్రాచ్యఖండములయం దీ వయోవికాసము ప్రేమవికారతరంగితమగు తరుణము. ఈయదనున అస్ఖలితమును, అకలంకమునగు స్త్రీమనోవికాసము ప్రపంచకాలుష్యమంటియంటక యాదర్శబద్ధకౌతుకమై యుండును. విశుద్ధరాగవిలీనమగు హృదయమునకుఁ బ్రపంచము స్వప్నసాదృశ్యమని యార్యుల యాశయము. కేవలాదర్శ రక్తిమయమయిన మనోవృత్తి యేమాత్రపు హైన్యమును సైపఁజాలదు. అందువలననే యెంతటిస్వార్థత్యాగమయినను నిరాయాసముగఁ జేయఁగలదు. ఈ సత్యము ఇతిహాసములం దీసరి కనేకపర్యాయములు ప్రదర్శింపఁబడియున్నది. "భారతమునందలి సావిత్రియు, ఆంగ్లసారస్వతమునందలి జూలియట్టును ఈయీడువారలె". ఆకర్ణనోపయమైన కుమారీప్రేమ యిరువురయందును బూర్ణస్థాయినందినది; తరువాతఁ దద్వైపరీత్యములు తెలియవచ్చినవి; కాని స్థాయిని చలింపఁజేయలేకపోయెను. వివాహానంతర మొకసంవత్సరమునకు మరణించు సత్యవంతుని సావిత్రి విడువలేదు.

చైతన్యశూన్యమగు మృత్యుసదృశావస్థనుపొందుటకు జూలియట్టు జంకలేదు. ఇందులకుఁగారణమేది? స్వార్థనిస్పృహమగు కుమారస్త్రీప్రణయోన్మాదమె. విశుద్ధమగు స్నేహలతామనఃప్రణయము ఒకానొక ద్రవిణకాంక్షాదీక్షితుని పాలుగానున్నదని యీయమకు దోఁపకయుండదు. పితృగృహనిర్మూలనమగు తన కల్యాణము ఆకన్యామతల్లి యుదాత్తదృష్టికెంతయో నిరసనప్రాయముగఁ గనుపట్టియుండును. శుల్కమీయఁజాలని కులీనకన్యాత్వము ప్రతిగ్రహయోగ్యముకాదో యని యొకనైతికశంక. ఈ నిర్బంధాచారము జ్ఞానపుష్పితమైన యుత్తమకన్యాదృష్టికి హేయలజ్జాకరముగ నుండదా? తదుచ్ఛేదనమునకై స్నేహలతాదేవివంటి యవతారకన్యక లాత్మసమర్పణమొనర్చి, పునరుద్ధారకమునకు మార్గదర్శినులు కారా?

జ్వరపీడితుఁడనైయుండి నేనీయుదంతమునువింటిని. చాలవఱకుఁ దీవ్రజ్వరముతోడనే వ్రాసితిని. మిత్రులగు శ్రీయుత గజవల్లిరామచంద్రరావు యం. యే. గారు స్నేహలతాదేవి లేఖంగొనివచ్చి ఇందలి మూఁడవభాగము వ్రాయుచుండ వినిపించిరి. ఆలేఖను యథానుకూలముగఁ బొందుపఱచుమని సూచించిరి. అట్లే యీలేఖ యథార్థస్ఫురణముగా ఛందోబద్ధముఁ గావించితిని. నా యీ చిన్నిపొత్తమునసురక్తితో నాలించి స్నేహలతాదేవి చరిత్రయందలి బద్ధప్రీతిలాంఛనముగ దీనిం బ్రచురింపఁజేయు నవకాశముగల్పించిన శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారికి నాకృతజ్ఞతాపూర్వక వందనములాచరించుచున్నాను. ఈచిన్నిపొత్తమును నాలుగు రేకులుగా విడదీసితిని. అందులకుఁగారణము లేఖకులూహింపఁగలరు. గంగాతీరమునందలి సంభాషణము స్నేహలతాప్రియంవదల పరస్పరపరిచయస్ఫురణముగా గ్రహింపవలెను. హరేంద్రుఁడు స్నేహలత తండ్రి. పుణ్యావల్లి, శ్యామ, రోషణకుమారీమున్నగునవి ఆయా కన్యలపేర్లు. ఇందలిదోషములువిడచి గుణములె పరిగ్రహింప నాంధ్రమహాశయులను బ్రార్థించుచున్నాను.

ఇట్లు

గ్రంథకర్త

# అంకితము

గీ. సుప్రథమహృదయుఁడైన వాల్మీకి మొదలుగాఁగ
నెందఱెందఱు సుతులనో యెత్తిపెంచి
మమతతీఱని యేకకుమారసరణి
ననుఁగటాక్షించు తల్లి వాణిని నుతింతు.

గీ. బొందినశియించియును వహ్నిఁబూతమయిన
బూదియందును ఛాయాప్రపూర్ణరాగ
రసవికాసము లొప్పనఁగ బ్రణయవిదుల
పరమబోధల నెంతు భావమ్మునందు.

గీ. ఆర్యకన్యాకులీనత కర్పణముగ
తనవుదొరఁగిన స్నేహలతామతల్లి
రగులఁజేసిపోయిన పవిత్రంపువహ్ని
ఋషుల యీ భూమిఁ బునరుద్ధరించుఁగాత!

ఓం

# స్నేహలతాదేవి

—ంంఃంం—

పూరిల్లు

గీ. నిత్యసాంధ్య కుమారీమణీమతల్లి
కట్టుచీరచెఱంగులు కాలుపోల్కి
నస్తగిరి మస్తకమున సన్యస్తకాంతి
సాంద్రుఁడగు సూర్యభగవాను చాయ లలమె. ౧

గీ. ఆహితాగ్ని, సమస్తవేదాంగవేత్త,
హరుఁడు సాయమర్ఘ్యప్రదానాదరమున
నుద్ధరణి పంచపాత్రయు నూని, ద్వార
వేదిపైఁ గూరుచుండె నావేళయందు. ౨

చ. హరునిగృహంబుప్రాఁబడినయాకులయిల్లయినందదీయమం
దిర సముపాంతవృక్షములు తీరిచినట్లు నిసర్గశోభలం
బెరుఁగుచు జూచువారి వలపించుచునుండు, విశుద్ధగోమయ
స్ఫురితసుగంధమై వెలుఁగుఁబోనలుమూలలునింటిలోపలన్!

గీ. రావిచెట్టొండు కొమ్మలు రాచుకొనుచు
నీడలో ఱయఁగనుండు, నా నికటమునకుఁ
బూర్వభాగమునందు, నపూర్వశోక
హతి విలాపించుచుండె విహంగమొకటి. ౪

గీ. పచ్చికబయళ్ల మేపఁ బ్రభాతమందుఁ
దోలి పెట్టిన నిండుఁ గ్రొద్దుల మొదవును,
గోపకుఁడు కట్టిపోయె, నెక్కుడుగ రోజు
ధేనుముఖమునఁ జిక్కముఁ దీయకుండ. ౫

గీ. బ్రాహ్మణి యొకర్తు పాలిండ్లఁ బైఁటజాఱ
'ఏల? పోయెదె యీసాంధ్యవేళ' ననుచుఁ
దఱముకొనివచ్చె ద్వారబంధమ్ము వఱకుఁ
బదియు నయిదేండ్లు నిండని బాలనపుడు. ౬

ఉ. పూవులతోడఁ జేసినవిపోలె మనోహరమార్దవంబులై
యావిపులాయతాక్షి యొడలన్నియు సొంపులు నింపుచుండెలీ
లావిశదస్మితంబయి విలక్షణమైన కుమారికామణీ
శ్రీవదనంబు చూడుమని చెప్పక తప్పదు నాకు నెచ్చెలీ. ౭

గీ. నడలయొప్పుల వినయబంధములు గలవో
చూపుల విముగ్ధమయిన నాజూకు గలదో!
నగుమొగమ్మున నందచందములు గలవో!
లలితహృదయాన నేమితలంపు గలదో! ౮

గీ. తెలియలేనైతి జడమతికలన నేను
నిత్యపరిచయవశత గణింపలేదు
కన్నజనయిత్రి, వెనువెంటనున్న చెలియ
ప్రియయు నెందులనో కనిపెట్టఁదయ్యె. ౯

గీ. ఏమిసేయుదు? నఱసం.దె నీ విషాద
మృదులగీతికఁ బాడు నో సదయహృదయ!
చూడుమని యెద భావ విశుద్ధవీధి
నల్ల స్నేహాలతా దేవి యాననంబు. ౧౦

చ. నడచినఁ గందిపోవు చరణమ్ములటంచుఁ గలంగుచుందురా
బిడతలిదండ్రులెప్పుడును, విచ్చినపుష్పమువోలెఁ బుట్టె వం
గడమున కెల్లమానికముగా నయగారికుమారి, యెత్తిదిం
చెడు సతియెవ్వతో పిలచె 'స్నేహాలతా' యని శైశవమ్మునన్.

గీ. పరిచయరహస్య మాధుర్యమెఱిఁగినట్టి
ప్రణయులకు స్నేహాలతయట్లు, ప్రాప్తవశత
కలసిమాటాడినట్టి ధన్యులకు నెల్లఁ
దలఁపు వెడలదు స్నేహాలతా కుమారి. ౧౨

గీ. అటుల తఱుముకవచ్చిన యనుఁగుతల్లి
చనవుఁ బెంపున మఱలింపఁ జాలదయ్యె,
చెలి ప్రియంవదతోఁ గూడి నిలయమెడలి
గంగ కేగుచునున్న యాకన్నె నపుడు. ౧౩

గీ. పశ్చిమాభిముఖుండయి పరమనిష్ఠ
సంధ్యవార్చుచున్న హరేంద్రశర్మగూడ
ఎదియుఁబలుకక యఱగను లెత్తిచూచు
చుండె స్నేహాలతాముఖమండలంబు. ౧౪

చ. గొనముల ప్రోవు నా యనుఁగుకూతు మొగమ్మును జూచి
దైవమాయని తనుదాననొచ్చుకొని యాకులమందెనుగాని
బాల నెమ్మనమున నెత్తురొల్కు నని మాత్ర మెఱుంగకపోయె
బ్రాహ్మణుం, డెనయు నిశాంత దీపకళయే స్ఫురియించు
కుమారిచిన్నెలన్. ౧౫

ఉ. స్నేహలతా ప్రియంవదలు చిన్నతనమ్మున నుండియున్ సుహ్రు
న్మోహనిబద్ధలై కలసిపోయి రెడాటలు లేని కూరిమిన్
దేహములందుఁ దక్క విడఁదీయఁడు వారల బ్రహ్మ, యీడుజో
డై హృదయంగమంబగు ప్రియప్రణయమ్మున కేదిపారమో!

క. అయి దేంత భేద మున్నది
ప్రియంవదా స్నేహలతల విప్రవయసునం
దయినను స్ఫురియింపదు పరి
చయహీనుల కెందు కీ విచారము మనకున్. ౧౬

గీ. ఆటపాటలయందుఁ బ్రియానులాప
ముల వలపునందు, నొండొరుఁబిలుచుకొనరు
పూర్ణనామమ్ములను నాసువర్ణగాత్ర
లెంత మధురంబులో స్నేహవృత్తులవుర. ౧౭

చ. లతయని ముద్దుపేర సరళమ్ముగఁబిల్చుఁ బ్రియంవదా సుహృ
ద్వ్యతిపిలచుం 'బ్రియా' యనిముదమ్మున స్నేహలతాకుమారి
యే వ్రతములు సల్పిపొందినసరాగమొ కానివచింపఁజాలమా
జత చెలికారపుమ్మమత స్వాప్నికసాధ్యమ యేమొ భూమిపై.

గీ. నిగనిగలువోవు చిన్నిబిందియ బుజాన
నడరుచుండఁ బ్రియంవద నడువఁదొడఁగె
రేగిపోకుండ దువ్వి చేర్చిన బిగింపు
కురులజడచుట్ట యాబిందె నొఱసికొనఁగ. ౨౦

గీ. శిథిలకుంతలయైయుండె స్నేహలతయు
నునుపుఁగాటుక కనుపొట్టలెనయఁ జెరగి
యొక యనాదరణంపుఁ బొందిక వెలార్చ
ముందుముందుగ నామెతోఁ బోవునపుడు. ౨౧

గీ. వారియింటికి నెంతయోదూరమందు
లేదు గంగాభవాని చీలికలు వోయి
పాఱుచుండుఁ గొండొకచూపుమేర కెలన
నీటిదాఁకను నిసుకయే నిండియుండు. ౨౨

౨

గంగాతీరము: స్నేహలతాప్రియంవదల సంభాషణ.

గీ. శ్రీభరతమాత కంఠాన సిరులు దొరయు
నాణెముత్యాల కల్యాణ హారమనఁగ
తేటలొలయు నార్యావర్త దేశమందు
జ్ఞానరసదుగ్ధ వెల్లి! గంగామతల్లి! ౨౩

గీ. హరుని జడలను పల్లవసరసిలోన
నలరు నీదేవతాక్షీరములను సతము
స్నానమాడికాఁబోలు దోషాకరుండు
కువలయానందుఁడను నుతిఁగొనియె నక్క! ౨౪

గీ. వైదికయుగంపునాఁటి దివ్యర్షులెల్లఁ
బవనచాలనమున నలల్ గవిసికవిసి
తుంపురుల గుంపులెత్త స్తోత్రోద్ఘోపులాడు
నిందు నవగాహనముఁ జేసి యుందు రపుడు ౨౫

గీ. కులపతులవాటికల సరస్సులకు మంచి
నీరువోవు సరిత్కూలతీరములను
బట్టి మేసెడి హరిణశాబములు రెండు
మనవలెనె నచ్చియుండు నంచును స్ఫురించు. ౨౬

గీ. సుప్రశాంతములగు నుషస్సులను లేచి
చలినెఱుఁగక మాఘస్నానములను సలిపి
తపసికన్నెలు నల్కల ధారణమున
పసుపుముగ్గులు తీర్చి రీ భవ్యతటిని. ౨౭

గీ. ఋషు క్కులను బాడి రీ నదీప్రియతటమున
యజ్ఞములు సల్పి రీ యేటి యంతికమున,
ఉపనిషత్సూక్తి పరిమళ మొదవె నిచటఁ
బూజ్యరాలౌట యరుదె యీ పుణ్యగంగ. ౨౮

గీ. తల్లి భాగీరథీదేవి చల్లనయిన
కడుపునందాగి ధన్యయై యడఁగి యుండెఁ
బూతయమునాతరంగిణి పూర్వజన్మ
సుకృత పరిపాకమిట్లు పండకయ యున్నె. ౨౯

గీ. కడిమి పూఁజెట్ల దట్టమౌ గట్లకెలన
మృదులసైకతశయ్యల రేలు పవలు
నాడుకొన్న రా ధా కృ ష్ణు లస్తమింప
నెట్టులోర్చును గాళింది హృదయమకట! ౩౦

గీ. ఆర్ద్ర తులసీదళీమాల నందగించు
కంఠమును బాలపోలికఁ గౌఁగిలించి
వదలి సాగసిన వాత్సల్యభరము వదల
నేడ్చెఁగాఁబోలు వాల్గనులెత్తి రాధ! ౩౧

గీ. సరసతర వేణుచారణ చతురుఁడయిన
చిన్నిగోపాలుఁ గాంక్షించి స్నిగ్ధహృదయ
పరవశోన్మాదమున రాధపాడినట్టి
రాగరసము లీ తల్లిగర్భమునఁ గలవు. ౩౨

గీ. ఈతరంగిణి యొడ్డుల నిసుకమీఁద
సంజచాయ పూఁతలునడ్డ సమయములను
ఆఱఁబఱచిన నీర్కావి చీరలనుచు
మోసపోయియుండరె మునిముగుద లక్క! ౩౩

శా. రేకుల్ రేకులుగా నుషఃప్రణయినీ ప్రేమానురాగమ్ము ప్రా
చీకల్యాణకుటీరభాగములఁ బుష్పింపఁగ ప్రబోధోత్సవ
శ్లోకమ్ముల్ రచియించుచుం గడపఁబోలున్, నెచ్చెలీ! నిత్య
కన్యాకౌలీన పవిత్రజీవితము లార్యావర్తబాలామణుల్. ౩౪

గీ. తెలియఁజాలని పరమ తాత్త్విక రహస్య
బోధ సూత్రీకరించిన గాథ* లెన్నొ
మునురచించిన కన్యావిభూషణంబు
లొక్కరైనను బుట్టరేమో జగాన! ౩౫

గీ. ప్రకృతి మార్దవ పూర్ణశోభలను దెలిపి
పురుషునైజభౌతిక భరంబును వెలార్చి
పరమశుచియైన ప్రేమప్రపంచమునకు
నడచుమార్గము మఱల నేర్పడునె సకియ! ౩౬

గీ. వాక్కునర్థంబునకుఁ బరస్పరమనోజ్ఞ
మయిన ప్రణయముఁ గుర్తించినట్టి కవుల
రసవదున్మాద గీతికారక్తి సాగయు
వారిచట లోకమెల్ల స్వప్నముగ నెంత్రు. ౩౭

గీ. అనుచు భాషించుచుండె మోహనపుశ్రుతిని
స్నేహలత, లేచిపడుచున్న నీటియలలు
ఒండొరుల కంఠములు విడనోప కురికి
గంగపాలగు బాలలకరణినుండ. ౩౮

ఉ. నాఁడు లతాకుమారిక మృణాల లతామృదులోక్తులెల్లఁ గో
డాడఁదొడంగెనూరక ప్రియంవద, నేమియుఁదోఁపదయ్యెరా
పాడెడు సందియంబునహ తాహతయూటఁ బ్రవాహమందున
ల్లాడుచుఁ బోవుచున్న యురియాటల తామరపూవుపోలికన్.

* ఋగ్వేదములోని 'గాథ'శబ్దము: ఇందుఁ గన్యావిరచితములు పెక్కులు.

గీ. గగనమునఁబుట్టి బూచిన సొగసుపువ్వు
కాలగతి విడి నవలతా కంఠమందుఁ
బడియె, నటనుండి యవి రాల్పఁబడెడు నింక
నెచటఁబడి వాడిపోవునో యెఱుఁగరాదు. ౪౦

ఉ. పాలమెఱుంగు చెక్కిళులపై కపణాంక నితంబమండలీ
చేలముపై కలస్వనముఁ జిల్కు మనోహరకంఠ మంజరీ నాళ
ముపై ప్రదోషతరుణంపురుచుల్ భ్రమియించు నాఁటియా
బాలికవాలకమ్ము తలపన్భయమయ్యెఁ బ్రియంవదాహృదిన్.

గీ. కీడుశంకించు భావపంక్తిని నొకింత
సరళి మొనరించుకొనుచుఁ, బ్రసన్నవదన
యలప్రియంవద యిట్టులఁ బలుకసాగె,
ప్రక్రమ విహీనమయిన ధోరణి యెసంగ. ౪౨

గీ. వెండికలశము లట్లు బింబించు శిఖర
మస్తకములెత్తి చూచు బ్రహ్మాండమెల్ల
పర్వతవతంసుఁ డీమె యబ్రంపుతండ్రి
యెంత కౌలీనమో యీస్రవంతి మణికి! ౪౩

గీ. హిమగిరి నితంబములు కన్న యిండ్లుగాఁగ
నడరు నీళ్లాడు ఋతువులు గడపవచ్చు
వనదసుత లక్క చెల్లెండ్ర పసుపుఁబంట్రు
కడిమి పూపిండితోడ నీగాంగతటిని. ౪౪

గీ. ప్రకృతి సారళ్యపారుష్యభరిత మేని
గంగ నైర్మల్యకాలుష్యకలిత నిజము,
సామగాన మాధుర్యవాసనయె కాదు
కలదు కౌరవ రక్త కశ్మలము నిందు. ౪౫

గీ. కారణాంతరముల నీజగమ్మునందు
రక్తి తెగి పోయినట్టి సుప్రాణతతికి
నధమశరణంబయగు నీమహాప్రవాహ
గర్భ మెంతదారుణ కష్టనిర్భరంబొ? ౪౬

గీ. శశికిరణ పుంజ తరళిత స్వరతరంగ
ములను గాంక్షించిచూతురు మోహసౌధ
వీధికలనుండి యూల్లగల్ విసువులేక
యీనదీతీర నాగర హృదయసీమ. ౪౭

గీ. నావలను త్రోసికొంచు సుందరుల తోడ
నిత్యసాయంవిహారముల్ నెఱపునట్టి
మత్తులెఱుఁగంగ లేరీమె మహిమనింత
కలుషితాచార దోషవిహ్వలత లతరొ! ౪౮

గీ. పంకనిర్మగ్న కంఠమౌ పాడియావు
పగిది నున్నది ఋషులున్న భరతభూమి
కంటకంబులె పెరిఁగెడు ఖండవనులఁ
బూలచెట్లంతరించు టబ్బురముకాదు. ౪౯

గీ. మొన్న పెండిలిచేసిన పుణ్యవల్లి
జనకుఁడు ఋణాతిరేక లజ్జాప్రపీడఁ
గడవఁజాలక గంగలోఁబడి శమించె,
భయము తలయెత్తదో యీప్రవాహతలిని! ౫౦

గీ. ఊరినుండియే తెంచుచు నొక్కనాఁడు
చెప్పికొనిరి నాపతియును జెలియు నిట్లు,
చంద్రకాంతులమునుఁగు నాశలనుగనుచు
పిన్నితో వెన్కవచ్చుచు వింటినేను. ౫౧

గీ. లోక మరికట్టలేని వెల్లువలఁ బొంగి
కలుషితములైన భూములఁగడగినైన
నుచితధర్మముగా కిట్టు లుగ్రసాధ
నముగఁ బరిణమించుట యెట్టిన్యాయమగునొ!

ఉ. గొడ్డలి గంద్రవాయి నఱకుల్ దిని, కొమ్మలుపూలు లేక యీ
యొడ్డున నున్నవృక్షము లయో! తలపించుఁ బవిత్రధర్మముల్
చెడ్డ మహర్షివంశగృహసీమలఁ, జెల్లి! తరింపలేదె పా
ల్పడ్డ యధోగతిన్ భరతలక్ష్మి యొకానొకనాఁటికేనియున్

గీ. మంగళతరంగిణి మహర్షిమాన్యభగిని,
హరిపదోదక గర్భపుణ్యస్రవంతి
యయి యరయుచుంటఁగాదె యీ యధమజగతి
పూర్ణధర్మసంపాతంబుఁ బొందదయ్యె. ౫౨

గీ. తానువలచిన వరునకుఁ దగినశుల్క
మభిజనంబు లర్పింపలే కడలుచుండ
మానికమువంటి 'శ్యామ' జన్మంబు చెల్లి!
ఈమె పాల్పెసికొనె నెంతకృపణగతియొ! ౫౫

గీ. ప్రణయవిచ్ఛేదయయిన 'రోషణకుమారి'
నెవఁడొ కాముకపశువొకఁ డేవమాడ,
విషహుతాశనులనువేడి విఫలయగుచుఁ
గడకు గంగాభవాని యఙ్కము వహించె. ౫౬

చ. వలదని మోరకించిన యపాత్రపువియ్యము వారిమాటలన్
తలకడవంగలేక తిథితారలదోసముకైఁ గలంగుచున్
చెలియలినొప్పగించి జనసీమణి కన్నులనీరుగార్చె నీతల
మున నే! తలంపఁగ లతా! కటువయ్యెడునాఁటిలాంఛనల్.

గీ. నిత్యకళ్యాణతోరణ నిబిడయగునొ
శాశ్వత శ్మశాన జ్ఞానశాల యగునొ
తెలియఁగారాదు జాహ్నవీదివ్యతత్వ
మొకటనే మేలు కీడులు నొప్పుచుంట. ౫౮

గీ. నావివాహంబులో వసంతంబులాడి
మంగళస్నానమాడి రీ గంగయందె,
మనసఖీమణి మరణింప మందుశోక
మున నివాపోదకములిచ్చి రనుజులిందె. ౫౯

గీ. అనుచు నన్యోన్యభిన్నములగుచు దోఁచు
భావసాంగత్య మధురబింబనికురంబ
ములఁ బ్రియంవద సూపె, వీనులనొసంగి
యున్న స్నేహలతాదేవి వన్నెచెదర. ౬౦

గీ. మఱల నెన్నాళ్లకో నదీమాతయయిన
ఈ యమరవేణి కేతెంతు మిరువురమని
యస్ఫుటంబుగఁ బలికె స్నేహలత యపుడు,
ప్రియయుఁ వెనువెంటనే తలరించెనిట్లు ౬౧

క. నీ పెండ్లి వసంతములకుఁ
ద్రోపాడుచు బంధుజనులతో నిటు రామే?
రేపో మాపో వినఁబడు
నా పున్నెపు పలుకు ఋణమె యబ్బిన మనకున్.

ఆ. వె. అనుచు మాటలాడుకొనుచు నాయిర్వురు
పడఁతుకలును గాంగపథము వదలి
పోయి రిండ్లకెలనఁ, బుడమి నల్గడలను
కాళరాత్రికవిసి క్రమ్ముచుండ. ౬౩

# 3

## అగ్ని ప్రవేశము.

ఉ. చీకటికప్పువిప్పిన నిశీథమునం గనరావు మేఘముల్
ఆకసమందుఁ జీలి నడయాడుచునున్నను మండుచుండు తా
రాకలశాలిమాత్రమె, నిరాకులసృష్టియు సుప్తిమూర్ఛ పా
లై కనఁజాల దెట్టి విపదాశయముం దనభూతసంతతిన్. ౬౪

ఉ. రెండవయామమింకను తరింపఁగ లేదు మహేంద్రమందువా
దండను చందమామవలెఁ దళ్కులుజిల్కు మొగమ్ము నెత్తి బ్ర
హ్మాండముఁజూచుచుండెతనయామణియోర్తుక శ్రీయరుంధతీ
మండలికోసమోయనఁ గ్రమక్రమ భిన్నమనోవికారయై

గీ. కొంతసేపట్లుచూచి యేగుర్తు చెలికి
మనసుఁ దగిలెనో గాని నిమ్మళముగాఁగ
పెరటితలుపును నోరఁగాఁ దెఱచికొనుచు
తులసికోటదగ్గఱకేగి నిలచె నామె. ౬౬

గీ. అతి కరాళంబయిన నిశాయామమందు
బాల సుస్థిరసంకల్పవోలె నటకు
నేగుదెంచిన యామహాభాగ యకట!
స్నేహలతయంచు నేనేల? చెప్పవలయు. ౬౭

క. తారా సహస్రమండిత
నారాచము నరసియరసి నచ్చినగతిఁ దా
నీరీతిని తలపోసెను
చీరచెఱం గంసమందుఁ జెదరుచునుండన్. ౬౮

గీ. బాహ్యసృష్టికి నిద్రాప్రపంచ మొకటి
లేకయుండిన శాంతియే లేకయుండు
లోకమందున, సుఖదుఃఖలోలగతుల
సంకరముగాని యానందజగతియేదో! ౬

గీ. కంఠములుపట్టి నఱకిన ఘాతుకులును
చిర దురంత వ్యథాబాధ మఱుఁగువారు
నొక్కపగిదిని సమముగా నొడలు మఱచి
నెఱి ననుభవించు విశ్రాంతి నిదుర యొకఁడె. ౭

చ. తగినవరుండు రాఁడను వెతన్ కడు పెల్లఁ గృశించిపోవ నె
వ్వగలఁదపించు తల్లియు, వివాహనిబంధనమైన శుల్కమి
యగ నగు నంత ద్రవ్యమునకై పడరాని నికృష్టయాతనన్
బొగిలెడుతండ్రియుంజనని! పొందిరియిన్నుకశాన్తినియ్యెడన్

గీ. నిదురఁ బోవుచునున్నారు నిసువులెల్ల
తెల్లవాఱిన గృహలక్ష్మి తెల్లవాఱు
ఇంత దౌర్గత్య నైచ్య మే నేల తెచ్చి
పెట్టవలయుఁ బావనమైన పితృగృహాన? ౭౨

గీ. మాన్యులయిన మామకపితామహులు పూజ్యు
లెపుడొ నిలిపిన యీపవిత్రపుఁ గుటీర
మన్యజనపాద ధూళి మాలిన్యమంది
యహిత భాషోపఘోష దైన్యమునఁబడునె. ౭౩

గీ. నాకతంబున ముద్దుకూనలును, నమ్మ,
తండ్రి! నీవును దీర్ఘనిదాఘతాప
బహుళ దారిద్ర్యవారాశిఁ బడెడువారె?
వలదు నల దట్టి కులమహోపద్రవమ్ము. ౭౪

గీ. భరతజనయిత్రి సుకృత తపఃఫలమ్ము
లన నుదయమైన యువజనులక్కటకట!
అధమపౌరుషమనక కన్యలవరింప
శుల్కముల కాసఁ జేసెడు శూరులయిరె? ౭౫

గీ. వేదములు పుట్టినట్టి పవిత్రసీమ
శుద్ధకన్యాకులీనత శుల్కమునకుఁ
బాలగునవస్థ యిసిరో! సంప్రాప్తమయ్యె;
తీర్పు లేనె నా ప్రాణసమర్పణమున. ౭౬

గీ. తావకీన మనఃపీడ పోవుగాక!
మామకీన కన్యాదర్శ మహితపదవి
నీచశుల్కము పాల్గాక నెగడుఁగాక!
నదనదాత్మోపహార సంసక్తిఁ దండ్రి! ౭౭

గీ. పశుసహజమైన పురుషస్వభావ మిటులఁ
బావన స్త్రీ కళాభాగపదవి నింత
నిరసనోన్మాద దృష్టి గణింపకున్నె?
ఋషిమహాదర్శముల నన్వయింత్రె యిట్లు? ౭౮

గీ. కన్నియను బెండ్లియాడునో? కన్నెతండ్రి
యర్పణముఁ జేయు శుల్కదివ్యాప్సరసను
బెండ్లియాడునో యకట! యీ పెండ్లికొడుకు.
అడుగరే యొక్కరయిన నీయార్యజనుల! ౯

గీ. సుంకమీయక మంగళసూత్రమునకు
యోగ్యురాలు కాదేని నిర్భాగ్యయయిన
కన్య, యాజీవితము నేల కాల్పరాదు
చెడు నుదాసీనతకుఁ బాలుసేయుకన్న? ౧౦

గీ. అనుచుఁ దలపోయుచుండ, నాయనుఁగుకన్నె
శిరసుమీఁదుగ 'హా' యని యఱచుచొక్క
పక్షి వినువీధినేగె. నా బాలికయును
'అనుమతించితే' తల్లీ యటంచుఁ గదలి ౧౧

గీ. ఇల్లుసొచ్చి ద్వారము మెలమెల్లమూసి
వ్రాసిదాచిన యొకయుత్తరమ్ముఁ దీసి
వేదికోపరితలమునఁ బెట్టి కన్నె
సంతరించెఁ గాఁబోలు నాసరికె యచట! ౧౨

గీ. తాను ధరియించియున్న యుత్తమదుకూల
మవలఁబడవైచి పూనె కన్యామతల్లి
తైలవస్త్రంబొకటి మడతలువిదిల్చి
నారచీరఁ దాలిచిన జానకి విధాన. ౧౩

గీ. అకట! యేమనిపలుక నోరాడునింక
భగవతీధ్యానయయి భగభగ వెలుంగు
నగ్నిలోనఁ బూర్ణాహుతియయ్యె నయ్యొ!
ధన్యగుణవల్లి, స్నేహలతామతల్లి. ౮౪

గీ. నవ్వు మోమున నిండు మనంబుతోడ
నొండురుల కౌఁగిలింపుల నోలలాడు
తండ్రి బిడ్డలపగిదిని దనిసిరప్పుడు
ఒదిగి స్నేహలతావీతిహోత్రు లవుర! ౮౫

గీ. విరియు చెంగల్వపూవుల చెరువు నందుఁ
గులుకు రాయంచకన్నియకోదమ పగిది
చూడఁదలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహలతామతల్లి! ౮౬

గీ. తామ్రపర్ణీనవారుణోదకములోనఁ
బొదలు తెలియాణిముత్యాల బొమ్మఁబోలి
చూడఁదలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహలతామతల్లి. ౮౭

గీ. మావిచిగురాకు నిగనిగల్ మలయు సెజ్జఁ
జెదరు ధవళోత్తరీయంపుఁ జెఱఁగువరుసఁ
జూడఁదలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహలతామతల్లి! ౮౮

గీ. పండు పగడాలరాశిలోఁబడి భ్రమించు
నిండు జాబిలిరేకనా నిర్మలముగ
జూడఁదలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహాలతామతల్లి. ౮౯

గీ. లిఖిత కుంకుమరంగవల్లికల నడుమ
తీర్చినట్టి కర్పూరలతిక విధానఁ
జూడఁ దలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహాలతామతల్లి! ౯౦

గీ. ప్రజ్వలించు మహౌషధీవనమునందు
రంజిలెడి తెల్లని సుధాసరస్సుచాయఁ
జూడఁదలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహాలతామతల్లి! ౯౧

గీ. సుభగ తాంబూల రక్తిమా శోభమధ్య
నొత్తు తెలినవ్వు రేకల గుత్తి మాద్రిఁ
జూడఁదలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహాలతామతల్లి! ౯౨

గీ. కనక కదళీదళంబులఁ గప్పఁబడిన
పారిజాత ప్రసవ దివ్య హారమనఁగఁ
జూడఁదలపించె భావవిశుద్ధవీధి
దహనులోనున్న స్నేహాలతామతల్లి! ౯౩

## ౪

### స్నేహలతాదేవిలేఖ

గీ. తనువు నవనీత భస్మ సాత్కారమంద
నామె భగవతీరూపాంకమయిన యాత్మ
విమల నక్షత్రలోకమార్గమును బట్టి
యేగె నొక దివ్యతేజమై యెల్లరరయ. ౯౪

గీ. స్నిగ్ధకాంచనలతనంటి స్నేహలతను
కడుపునంగాంచ నోఁచిన పుడమివేల్పు
గోలుగోలున నేడ్చె నా కూతుఁజూచి
బ్రాహ్మణి నిరస్తచైతన్యభాతిఁగూలె. ౯౫

గీ. భూరిపర్వత గండ గంభీరవీధిఁ
బడి పొరలి పోవుగంగాభవానిభాతి
ఆకసముఁజీల్చికొని లీనమయిన దేవి
స్నేహలతఁజూడరైరి మూర్ఛితులయగుట. ౯౬

గీ. ప్రాణములులేని కట్టెలపగిది నున్న
యావిషాద దంపతుల సత్యాదరమునఁ
జండశోకోప శమనోపచారములను
ఎట్టులెటులొ వేగించిరి హితులునాఁడు. ౯౭

ఉ. స్నేహలతామనంబు నెడసేసియెఱుంగని యాప్రియంవదా
స్నేహవతీమతల్లి విడిచెన్ నయనమ్ముల నుష్ణబాష్ప సం
దోహము, వేదిపైనపుడు దోఁచె నొకానొక లేఖ పావన
స్నేహలతాస్వహస్తకమనీయ కలాక్షరపూర్ణహారమై. ౯౮

ఉ. కన్నుల నీరునిండఁ, గొనఁ గంఠము గద్గదమైవణంక నా
స్విన్నముఖంబుతోడవినిపించెఁ బ్రియంవదయిట్లుమిన్నలున్
మన్నును, మీరు మేమును, సమస్తచరాచర భూతసృష్టియున్
కన్నియలోన లీనమయి గానముఁ జేయఁగ నామెనామమున్

---

లేఖ

పూజ్యతముఁడ వగు నో తండ్రీ!

గీ. నాదు పెండిలి కొఱకీ యనాదిగృహము
నాధి వెట్టుట వినవోపనయ్య నేను.
చేయఁగారాదు నీవిట్లు. చేయఁదగిన
విధి విధానంబు గూడఁ బ్రాప్తింపఁ బోదు. ౧౦౦

గీ. ఎల్లి చిఱుప్రొద్దుచాయ రేకెత్తకుండ
నిశ్చల స్వర్గ సంగీత నిలయమునకు
నడరిపోవంగఁ గలదు నీకడుపునందు
దుర్ముహూర్తానఁ బుట్టిన దుహితయాత్మ. ౧౦౧

గీ. లలితలతవలె నీయురస్థలము నెనసి
ముఱియు నను బెంచి తల్లారుముద్దుగాఁగ
కలలఁగూడ నాసౌఖ్యమే కలవరించి
కొల్లవెట్టితి నీప్రేమకూర్మి, తండ్రి! ౧౦౨

గీ. కన్నవారికి గారాబు కంఠమాల
నగుచుఁ బెరిఁగితి నీ పదునయిదు నేండ్లు
రాజరాజ కుమారికా రత్నములును
ననుభవింపరు నేనుపొందిన సుఖమ్ము. ౧౦౩

గీ. మొన్న నపరాహ్ణమునఁ జాలఁ బ్రొద్దు నీవు
కాళ్లువాయఁగఁ గట్టినకడపయెల్ల
తిరిగితిరిగి వేసారి యేతెంచినట్టి
దైన్యపు మొగమ్ము విడదు నాతలపుఁ దండ్రి! ౧౦౪

గీ. కడుపునంగన్న దుర్మోహ మడఁపలేక
యూసలేమి గత్యంతర మాచరింతె!
'యంతయునుబోయె' ననుశోకహతకటూక్తి
నాచెవుల మారుమ్రోయుచున్నదియ యింక.

గీ. నీవు సైచిన పలు కష్టనిష్ఠురముల
నావలి ఋణకథావిధమాలకించి
తిని మనోచ్ఛేదవృత్తి నో జనకమౌళి!
యింతఁ దెచ్చునె నీదురదృష్టపుత్రి. ౧౦౬

గీ. నన్నుఁగన్న దోషమునకు నన్నుఁ బెంచి
జ్ఞానవతిని జేసిన పాపకర్మమునకు
ననుభవింతె ప్రాయశ్చిత్తమనుచుఁ దండ్రి!
పైతృక స్వాపహరణ నిర్భాగ్య బాధ. ౧౦౭

గీ. కన్యకు వివాహమేలాటి కామితంబొ!
జనకుని యెడందభారము సడలదేని
ఆర్యసాంఘిక సాంప్రదాయములనింత
తెలియలేరె? యధోగతిఁ గలఁగికలఁగి. ౧౦౮

గీ. ఎంతసాంఘికనింద వహించితీవు
పరిణయముగాని నాదు పాపమ్ముకతన
గుణ కులీనుండయిన భర్తకొఱకు తండ్రి!
సలిపి తెన్నియత్నములు నిష్ఫలసమాప్తి. ౧౦౯

గీ. తల్లిబిడ్డలు విడిపోయి తల్లడిల్ల
లోకమును ముంచినట్టి వెల్లువలలోన
నార్తిహతులైన వారి సాహాయ్యమునకుఁ
బాటుపడిన నాసోదరుల్ వన్నెఁ గాంత్రు! ౧౧౦

గీ. మాతృదేశాభిమాన ప్రమాణబుద్ధిఁ
జేకొని విదేశవస్తువుల్ తాకమనుచు
భరతపుత్రకు లెందఱెందఱో వ్రతంబు
లూనినారంచు వింటి నత్యుత్సుకతను. ౧౧౧

గీ. ఎందుఁగనిన స్వార్థత్యాగమే యొసంగు
నీయుదయకాలమందును హేయమయిన
కన్యకావరశుల్క లాఞ్ఛనకళఙ్క
మును నిసీయని రోయఁడే యనుజుఁడొకఁడు.

గీ. కడచిన నిశీథమున నొక్కకలను గాంచి
యందుఁ బూనితి నీవ్రత మాప్త జనక!
మధురమధురమ్ముగా శ్రవోమార్గసరణిఁ
బరిమళించె నొకానొక భవ్యగీతి. ౧౧3

గీ. కన్యమైత్రేయి స్వరపూఁతకంఠమనుచు
నారదుని దివ్యమహతీస్వనంబటంచు
భారతీ పాణి వీణారవంబటంచు
నాలకించితి తండ్రి! నే నా సుగీతి. ౧౧౪

గీ. మురళి పాటలవలెఁ గొంతముద్దుఁగొలిపె
భ్రమరగీతలగతిఁ గొంత భ్రమఘటించె
సుకవి జయదేవ సరళగీతికల పగిదిఁ
గొంత రుచిఁగొల్పె నాగాన మంతరమున. ౧౧౫

క. పుడమిని కడలిని మును నె
న్నఁడుఁ జూడని యొక్క కాంతి నవనవమై పెం
పడరఁగ, దర్శించితి నా
నడుమను వెలుఁగొందు శ్రీ కనకదుర్గాంబన్.

క. మృదువాత్సల్య దరస్మిత
వదనమ్మున నన్నుఁబిలచెఁ, బరమానందా
స్పదమైన శ్రీభవానీ
సదనమునకు 'రమ్మురమ్ము' సత్వరమనుచున్. ౧౧౬

గీ. అపుడు తలఁచితి తండ్రి! పూజ్యాత్మునిన్నుఁ,
సంతత విషాదమైన మాజనని మోము,
నిల్లుపండువుఁ జేయు నాచెల్లి తమ్ము
లను, చిరప్రేమలీనమౌ మనసునందు. ౧౧౭

గీ. హృదయమును నంతకంత కైహికసమస్త
వస్తువాంఛాపరాఙ్ముఖ వ్యక్తి వెలుఁగ
పితృనిలయముద్ధరించి, మీ వెతలు గడప,
అంబ వెనువెంట వచ్చెద నంటి దండ్రి. ౧౧౯

గీ. నేను వోయినపిదప నానిండుబూదిఁ
దడుపుదురు మీరు బాష్పదుగ్ధముల చేత
తండ్రి! యైనను పితరార్జితంబు నిలచు
నలరు నస్మదస్ఖలిత కన్యాత్వమునని. ౧౨౦

గీ. అదిమొదల్ చింతజేసితి నస్మదీయ
లోక జీవితయాత్ర వీడుటకుఁ దండ్రి!
యగ్ని జల విషముల సాధనాంతరంబు
నెన్నుకొనఁగోరి స్వార్థనిస్పృహాసమాప్తి. ౧౨౧

గీ. యాగములలో హవిస్సుల నాదరించు
పూత తేజస్వి, ఋషిగేయు, వీతిహోత్రు
నెదను వినయాంజలిఘటించి, తుదకు తండ్రి!
ప్రార్థనలుసల్పితిని యంబపజ్జనిలుప. ౧౨౨

ఆ. వె. నాయనుంగు తండ్రి! పోయెద! పోయెద!
స్వీకరింపుమయ్య చిత్తశుద్ధి
కన్నబిడ్డయిచ్చు కడసారి యీవంద
నంబు నీశ్వరార్పణం బటంచు. ౧౨౩

గీ. మాతృ శీతల గర్భంబు మాడ్కి నిపుడు
ప్రకృతి నిదురించుచున్నది పరమశాంతి
మఱల మెలఁకువరాని యీ మధురసుప్తి
నేనుగూడ మహానంద లీననగుదు. ౧౨౮

గీ. నాదు సోదరీ సోదరు లాదరమున
నిచ్చు ప్రియబాష్ప మాలల నిష్టసక్తి
తీసికొనిరందు వీక్షింతు నాసతోడ
నమ్మయును నీవు వచ్చెదు నంతదాక! ౧౨౯

గీ. అధమ శుల్క కలంకము నంటకుండ
నాపవిత్ర మనఃకన్యకా పథంబు
రక్షణము చేసినట్టి యీ దక్షిణాగ్ని
కలుషి తాచారములఁ గాల్చి వెలుఁగుఁ గాక!

సమాప్తము

Printed at the Sadanandanilayam Press, Choolai, Madras.—1914